

# నవాబునందిని

మందారణ దుర్గం తిరిగి ఎప్పటిలాగే ఉన్నది. దాని పక్కన మామిడితోటా, దుర్గం కిందుగా ప్రవహించే దామోదరనది పూర్వం ఉండినట్టే ఉన్నాయి. ఆ కాళ రాత్రి విమల చేసిన పొరపాటు వల్ల పఠానులు దుర్గంలో ప్రవేశించి ఎంత భీభత్సం చేశారు! ఎంత కోలాహలం! ఎంత రక్తపాతం! ఆ రాత్రే దుర్గేశుడైన వీరేంద్రసింహుడు పఠానులకు బందీగా దొరికాడు; తన ప్రియురాలైన తిలోత్తమను ఒక్కసారి చూసి పోదామని వచ్చిన జగతసింహుడు దాదాపు ప్రాణం పోయిన దాకా పోరాడి, చివరకు శత్రువులకు చిక్కాడు; వీరేంద్రసింహుణ్ణి శత్రువులు చంపేశారు; విమల పఠానులకు నవాబైన కతలూఖాన్‌ను చంపి పగ తీర్చుకున్నది. ఎన్నో విపరీతమైన సంఘటనలు కొద్ది రోజుల వ్యవధిలో జరిగి పోయాయి.

కాని ఇప్పుడు వాటి చిహ్నలేవీ లేవు. మందారణ దుర్గం ఎప్పటి లాగా మనోహరంగా, ప్రశాంతంగా ఉన్నది. మార్పల్లా ఏమిటంటే వీరేంద్రసింహుడు లేడు; విమల ఇప్పుడు వితంతువు. నిజానికి విమల ఏం సుఖపడింది? తాను ప్రేమించిన భర్త పట్ల భార్యగా ప్రవర్తించటానికి ఆమె నోచుకోలేదు, అతని ఇంటి పరిచారికగా మసలుకున్నది. చివరకు భర్త కూడా పోయాడు. కాని విమలకు తృప్తి కలిగించే విషయాలు లేకపోలేదు. తన భర్తను చంపిన కిరాతకుణ్ణి, కతలూఖాన్‌ను తన చేత్తో పొడిచి

దామోదర ముఖర్జీ



చంపింది. విమలకు మరొక సంతోష కారణం కూడా ఉన్నది: తాను గారాబంగా పెంచి పెద్దచేసిన తిలోత్తమ-తన పెంపుడు కూతురు—రాజా మానసింహుడికి కోడలయింది; ఆమె గర్భవాసాన పుట్టే కొడుకు అంబరు రాజవుతాడు! ఇది తక్కువ సంగతా?

తిలోత్తమకు కూడా విచార కారణా లున్నాయి. ఆమె తన తండ్రిని పోగొట్టుకున్నది; పాపపూరితమైన కతలూఖాన్ విలాస గృహంలో బందీగా ఉన్నది—అలాటి దుర్గతి పట్టిన వారెవరూ తమ మానాన్ని రక్షించుకుని బయట పడలేరు.



కాని తిలోత్తమ ఎలాటి కళంకమూ కలగకుండా ఆ పాపకూపం నుంచి బయట పడగలిగింది; అది ఒక సంతోష కారణం. అలాగే, ఆమె ప్రియుడైన యువరాజు జగతసింహుడు మృత్యుముఖం నుంచి బయట పడటం మరొక సంతోష కారణం. అన్నిటినీ మించిన సంతోష కారణం తిలోత్తమ జగతసింహుడికి భార్య కావటం.

పఠానులు ఓడిపోయాక మానసింహ మహారాజు మందారణ దుర్గం వీరేంద్ర సింహుడి భార్య అయిన విమలకూ, కుమార్తె అయిన తిలోత్తమకూ చెందేలాగు ఆజ్ఞ ఇచ్చాడు.

జగతసింహుడికీ, తిలోత్తమకూ వివాహమై ఇంకా పూర్తిగా నెల కాలేదు. అపరాహ్ణం వేళ అంతఃపురం పైభాగాన జగతసింహుడు ఏదో ఆలోచనలో మునిగి ఉండి అటూ ఇటూ పచారు చేస్తున్నాడు. అతని ఆలోచనకు కారణం ఉన్నది. దారుకేశ్వరనదీ తీరాన శిబిరం ఏర్పాటు చేసుకుని సైన్యంతో సహా ఉంటూ వచ్చిన మానసింహుడు, పఠానుల అల్లరి అణగారిపోగానే శిబిరం ఎత్తేసి పాట్నాకు వెళ్ళిపోయాడు. ఆ సమయంలో జగతసింహుడు శిబిరానికి వెళ్ళి తన తండ్రిని కలుసుకోలేదు. ఇప్పు





డతనికి వేరే పని ఏదీ లేని కారణం చేత తన భార్యతో కలిసి సుఖ సముద్రంలో ఓల లాడుతున్నాడు.

కొద్ది సేపటికి అత నున్న చోటికి తిలో త్తమ వచ్చింది. వారు ప్రేమసల్లాపా లాడు కుంటూ తమ ఇద్దరిలో ఎవరిది ఎక్కువ అదృష్ట మనే విషయమై తర్కించు కున్నారు. తనదే ఎక్కువ అదృష్ట మని జగతసింహు డంటే తనదే హెచ్చు అదృష్ట మనటానికి తిలో త్తమ కారణాలు చెప్పింది. జగతసింహుడు అంబరురాజు కొడుకు; అందం లోనూ, శౌర్య పరాక్రమాల లోనూ సాటిలేనివాడు; తాను ఒక చిన్న భూస్వామి కుమార్తె, అతనికి పాదదాసిగా ఉండటానికి తగనిది.

అంతతో పోనివ్వక తిలో త్తమ తన కోసం జగతసింహుడు చేసిన సాహసాలను ఏకరువు పెట్టింది; "వీరాధివీరులై ఉండి కూడా నన్నొక సారి చూడా లన్న కోరికతో అర్ధ రాత్రి వేళ దొంగ లాగా దుర్గంలో ప్రవేశిం చారు. నాతో రెండు మాటలు మాట్లాడటం కోసం పరాయి వాళ్ళ అంతఃపురంలో ప్రవే శించారు. నా ప్రాణాన్ని కాపాడటం కోసం మీ రక్తం ధారపోసి, ప్రాణా లర్పించటానికి కూడా సిద్ధపడ్డారు. నన్ను పెళ్ళాడి, నా ప్రేమ కోసం మీ తండ్రిగారి ఆగ్రహానికి కూడా మిమ్మల్ని మీరు గురి చేసుకు న్నారు," అన్నది.

తిలో త్తమ మానసింహుడి ఆగ్రహం గుర్తు చెయ్యగానే జగతసింహుడు కలవర పడ్డాడు. "ఇది చాలా పెద్ద సమస్య. దీన్ని గురించి ఏం చెయ్యాలో ఆలోచించాలి," అన్నా డతను.

తిలో త్తమ ఈ మాటలు విని ఏమీ అన లేకపోయింది. ఆమె ముఖం ముడుచుకు పోయింది.

"మా నాన్నకు నా పైన కోపం ఉన్నది. అది నాకు తెలుసును. ఆయన తన కోపాన్ని



పైకి ప్రకటించలేదు, ఇతరుల ద్వారా చెప్పించనూ లేదు. అయినప్పటికీ ఆయ నకు కోపం వచ్చిం దనటానికి లక్ష సూచన లున్నాయి," అన్నాడు జగతసింహుడు.

"అయితే మీరు జాగ్రత్తపడ రెందుకూ?" అని తిలోత్తమ అడిగింది.

"జాగ్రత్తా? ఎంత అమాయకురాలివి! నీ ప్రేమలో ఓలలాడే వాడు మృత్యువు ఎదట వచ్చి నిలబడితే మటుకు లక్ష్య పెడ తాడా? నేను జాగ్రత్త గురించి ఆలోచిం చటమే లేదు," అన్నాడు జగతసింహుడు.

"అయితే ఏమి టాలోచిస్తున్నారు?" అని ప్రశ్నించింది తిలోత్తమ.



"రెండు విషయాలను గురించి ఇప్పు డాలోచించాలి. మా నాన్న రాజపుత్ర వీరుడు. చెయ్య దలచిన పనిని వాయిదా వెయ్యడు. ఆయనను అడ్డేవా డెవడూ లేడు. అక్బరు పాదుషాయే ఆయన మనసు కని పెట్టిపోతా డంటే ఇంక ఇతరుల సంగతి చెప్పే దేమిటి? అందుచేత ఆయన నాకు మరణ శిక్ష విధించినా దానికి తిరు గుండదు...భయపడకు, నాకు చావుభయం లేదు. రాజపుత్రుడికి మరణ భయం లేదు. కాని మరణం వల్ల కలిగే వియోగ బాధ గురించే నాకు భయం," అన్నా డతను.

"వియోగ భయం నా కేమీ లేదు. వీరుల లాగే వీరపత్నులు కూడా నవ్వుతూ ప్రాణాలు విడవగలరు," అన్నది తిలోత్తమ.

"సరే, ఆ భయం లేద నుకుందాం. అంతకన్న పెద్ద భయం మరొక టున్నది. మా తండ్రి నా ప్రాణం ఒక్కమారుగా తీయక, అంతకన్న కఠోరంగా నన్ను తీవ్ర మైన యాతనకు గురి చెయ్యవచ్చు."

"అదెలా?" అన్నది తిలోత్తమ కంపిస్తూ.

"మన వివాహం ఇష్టంలేక మన ఇద్ద రినీ ఆయన వేరు చేసెయ్యవచ్చు."

ఈ మాట విని తిలోత్తమ కళ్ళనీరు కారుస్తూ, "నా మారుతల్లి విమల శాస్త్రో



క్తంగా మా తండ్రిని వివాహం చేసుకుని కూడా, మా ఇంట దాసీగా కాలం పుచ్చింది. మామగా రింట నా కటువంటి స్థానమైనా దొరకదా?" అన్నది.

"భయపడకు, తిలోత్తమా. అకారణంగా నీ మనస్సును క్షోభపెట్టుకోకు. అంత దాకా వస్తే మనం మానవ సమాజాన్ని విడిచి పెట్టేసి, ఎక్కడో సముద్ర తీరాన, ఏ చెట్టు నీడనో సుఖంగా కాపరం చేద్దాం. అయినా మా తండ్రి తలుచుకుంటే ఆయన చెయ్యి లేని దంటూ ఉండదు. అందుచేత ఆయనను సుముఖుణ్ణి చేసుకోవటానికి అన్ని విధాలా ప్రయత్నిస్తాను. ఆ పైన దేవు డున్నాడు!" అన్నాడు జగతసింహుడు.

"ఏ దారీ లేకపోతే మరణం ఉండనే ఉన్నది," అన్నది తిలోత్తమ గుండె రాయి చేసుకుని.

ఆ రాత్రి ఆ భార్యాభర్తలకు విచారం మూలాన, ఎంత ప్రయత్నించినా కునుకు పట్టలేదు. చివరకు తెల్లవారుజామున తిలోత్తమ కళ్ళు మూసి నిద్రపోయింది. జగతసింహుడు ఆమెకు నిద్రా భంగం కలగకుండా పక్కమీది నుంచి లేచి, చల్లగాలికి గుర్రం మీద తిరిగి వచ్చి కొంత శాంతి పొందుదా మనుకున్నాడు.




అతను తన తెల్ల గుర్రం ఎక్కి కోట ద్వారం దాటివచ్చి వెనక్కు తిరిగి చూశాడు. తిలోత్తమ శయన మందిర గవాక్షం వద్ద నిలబడి అతన్ని చూస్తున్నది. "లోపలికి వెళ్ళు. నే నిప్పుడే వస్తాను," అని చేతితో సైగ చేసి, జగతసింహుడు గుర్రాన్ని ముందుకు నడిపించాడు. కొద్ది దూరం పోయి వెనక్కు తిరిగి వద్దామని అతని సంకల్పం.

ఆ నాటి భయంకరమైన రాత్రి అతను విమల తెచ్చిన బల్లెంతో ఒక పఠాను వాణ్ణి చంపిన మామిడితోట కుండా అతను పోతూ ఉంటే గజపతి విద్యాదిగ్గజుడు—"రసిక రాజు" కనిపించాడు. అతని వేషం కొంత




హిందువులది గానూ, కొంత ముసల్మానులది గానూ ఉన్నది. అతను జగతసింహుణ్ణి చూసి, "ఖుదానారాయణుడు మీకు మేలు కలిగించుగాక!" అన్నాడు.

"గణపతి విద్యాదిగ్గజుడా!" అన్నాడు జగతసింహుడు ఆశ్చర్యంతో.

"ఔను, స్వామీ. వెనక వ్యాకరణం మొదలైనవి నేర్చాను. ఇప్పుడు ఉర్దూ కూడా నేర్చుకున్నాను. ఇక నా ఖ్యాతికి ఢోకా ఉండదు," అన్నాడు దిగ్గజుడు.

"ఈ వేష మేమిటి?"

"ఆ పొయ్యే పఠానులు ఊరికే పోక నా జాతీ, నా వేషమూ కూడా మార్చేసి మరీ పొయ్యారు. నేను మా గురువుగారి దగ్గిరికి వెళ్ళి పాఠం చెప్పమంటే, మూడు రోజులు గంగా తీరాన ఉండి, గంగా స్నానం చేసి, తల గొరిగించి, పిలక పెట్టుకుని వస్తేనే గాని పాఠం చెప్ప నన్నాడు. అలాగే చేసి వస్తున్నాను."

"మరి దుస్తులు?"

"ఏం చెయ్యను? నా బట్టలన్నీ పఠానులు కాజేశారు."

జగతసింహుడు దిగ్గజుడి చేతిలో ఒక రూపాయి పెట్టి, ముందుకు పోయాడు. అతను కొంత దూరం పోయే సరికి దూరంగా శైలేశ్వర మందిరం కనిపించింది. శైలేశ్వరుడి దర్శనం చేసుకుని, నమస్కారం చేసి రావటాని కతడు నిశ్చయించుకున్నాడు.

ఇంతలో గుర్రపు డెక్కల చప్పుడు వినిపించింది. దూరంగా గాలిలోకి దుమ్ము లేస్తున్నది. ఎవరో సైనికుల లాగున్నారు. వాళ్ళు పఠాను సైనికులు కావటానికి వీల్లేదు. పఠాను లందరూ ఒరిస్సాకు వెళ్ళిపోయారు. దేశంలో సైనికు డంటూ ఉంటే వాడు పాదుషా సైనికుడే.

త్వరలోనే అతను సైనికులను చూశాడు. వారు మానసింహుడి సైనికుల లాగా ఉన్నారు. సుమారు యాభై మంది ఉన్నారు.

వారి ముందు నడుస్తున్న నాయకుడు ఆజ్ఞాపించే సరికి సైనికు లందరూ గుర్రాలు నిలిపి ఒరల నుంచి కత్తులు దూసి భుజాల పై పెట్టుకుని, "అక్బరు పాదుషాకు జయం! రాజా మానసింహుడికి జయం!" అని నినాదాలు పలికారు.

జగతసింహుడు కూడా కత్తి తీసి, అలాగే నినాదాలు పలికి, సైనికుల నాయకుణ్ణి, "ఇదేమిటి, మథ్రాసింగ్? పాదుషా వారికి కుశలమా? మహారాజుగారు కులాసాగా ఉన్నారా?" అని అడిగాడు.

మథ్రాసింగు యువరాజును సమీపించి, ఒక రుమాలు నుంచి ఒక పత్రం తీసి, సవినయంగా అతనికి అందించాడు.

"ఏమిటి మహారాజుగారి ఆజ్ఞ?" అని జగతసింహు డడిగాడు.

"నేను తమ దాసుణ్ణి. నన్ను క్షమించాలి. మహారాజుగారు తమర్ని ఉన్న పాళంగా తీసుకు రమ్మని ఆజ్ఞాపించారు."

"ఎక్కడికి వెళ్ళాలి?"

"పాట్నాకు. అక్కడే ఉన్నారు మహారాజుగారు."

"ప్రయాణసన్నాహ మేమైనా చేసుకోవచ్చునా?"

"క్షమించాలి, యువరాజా. మీరు మా వెంట వెంటనే బయలుదేర నట్టయితే



బందీగా తీసుకురమ్మని మహారాజుగారి ఆజ్ఞ!" అన్నాడు మత్రాసింగు.

"అయిన వారితో చెప్పి రావటానికైనా అవకాశం లేదా?"

"దానున్ని క్షమించాలి."

"మహారాజుగారి ఆజ్ఞకు తిరుగు లేదనుకో... అయినా, ఒకవేళ నేను నీకు బందీ కావటానికి నిరాకరించి యుద్ధానికి తలబడితే ఏం చెయ్యమన్నారు మహారాజుగారు?"

"నా నోట అనరాని మాట అనిపిస్తున్నారు... యువరాజును సజీవంగా గాని, నిర్జీవంగా గాని తెచ్చి తమ ఎదట ఉంచమని మహారాజుగారి ఆజ్ఞ!"

తన తండ్రి వైఖరి తాను భయపడినంత తీవ్రంగానూ ఉన్నదని జగతసింహుడు గ్రహించాడు. తాత్సారం చేసి ప్రయోజనం లేదు, తండ్రి ఎదటికి పోయి దండన పొందటం తప్ప వేరు మార్గం లేదు.

అతను మత్రాసింగుతో, "నా సైన్యం దారుకేశ్వర నదీ తీరాన జహనాబాదు దగ్గిర ఉన్నది. దాని గతేమిటి?" అన్నాడు.

"దాని విషయమై నేను ఏర్పాటు చేస్తాను," అని మత్రాసింగు ఒక సైనికుణ్ణి జహనాబాదుకు వెళ్ళమన్నాడు. ఆ సైనికుడు మందారణ మీదుగానే వెళ్ళాలి.

జగతసింహుడు ఆ సైనికుడితో, "నీకు మందారణ దుర్గ ప్రాంతంలో ఎవరైనా కనిపిస్తే, నేను మా తండ్రిగారి ఆజ్ఞపై ఆయనను చూడటానికి పాట్నా వెళ్ళానని చెప్పు," అన్నాడు.

తరవాత అతను తన తండ్రి పంపిన అశ్వికుల వెంట బయలుదేరాడు. అతని కోరిక ప్రకారం మత్రాసింగు తన సైనికులను రెండు భాగాలు చేశాడు. వెనకా, ముందూ సైనికులు నడుస్తుంటే, మధ్యగా జగతసింహుడు నడిచాడు, అతని పక్కగా మత్రాసింగు నడిచాడు. —(ఇంకావుంది)





# నవాబు నందిని

## 2

మానసింహుడి దృష్టిలో జగతసింహుడు చేయరాని పనులు, ఒకటీ, రెండూ కాదు, అనేకం చేశాడు.

అనేకమంది యోధుల సమక్షాన జగతసింహుడు తండ్రి ఎదట నిలబడి, అయిదు వేల సైన్యాన్ని ఇచ్చినట్టయితే, పఠానులను సువర్ణరేఖానది అవతలికి తరిమేస్తానని ప్రమాణం చేశాడు. అంత కార్యభారం నెత్తి మీద వేసుకున్నవాడు ఆ పని విడిచిపెట్టి, అర్ధ రాత్రివేళ తన ప్రియురాలిని వెతుక్కుంటూ మరొకరి కోటలోకి దొంగలాగా ప్రవేశించి, పఠానులకు చిక్కి, బందీ అయాడు. ఈ విధంగా అవిధేయుడూ, అయోగ్యుడూ అని నిరూపించుకున్న కొడుకు పైన మానసింహుడికి ఎక్కడలేని అగ్రహం పుట్టుకొచ్చింది.

ఆ కోపం మూలానే ఆయన పఠానులను నిర్మూలించి, తన కొడుకును విడిపించుకునే ప్రయత్నం కూడా చెయ్యలేదు.

విమల చేత చచ్చే ముందుగా కతలూఖాన్ జగతసింహుణ్ణి విముక్తుణ్ణి చేసి, మానసింహుడి వద్దకు సంధి రాయబారం పంపాడు. కొడుకు తెచ్చిన సంధి రాయబారానికి మానసింహుడు సుముఖుడయాడు. ఎందుచేతనంటే, ఆయన శీఘ్రంగా ఢిల్లీకి వెళ్ళవలిసిన పని ఉన్నది; వర్షాకాలం గడిస్తేనే గాని సయ్యద్‌ఖాన్ తన సేనలను తీసుకుని వచ్చి చేరడు. పెద్ద

దామోదర ముఖర్జీ



ఎత్తున యుద్ధం కన్న సంధే మేలు. సంధికి మానసింహుడు ఒప్పుకోగానే, కొత్త నవాబు సులేమాన్‌ఖాన్, తన మంత్రి తోనూ, సేనానాయకుడైన ఉస్మాన్‌ఖాన్ తోనూ వచ్చి మానసింహుడికి పెద్ద ఎత్తున కానుకలు సమర్పించాడు. మానసింహుడు వాటితో తృప్తిచెంది, వచ్చిన వారిని తగినరీతి సత్కరించి పంపేశాడు. ఆయన తన మొంగలాయీ సైన్యాలను పాట్నాకు వెళ్ళిపోవలసిందని ఉత్తరు విచ్చినప్పుడు, ఆ సైన్యానికి చెందిన ఒక సేనాపతి అయిన తన కొడుక్కు ఎలాటి బాధ్యతా ఇవ్వలేదు. అతన్ని గురించి విచారణ జరపాలన్న భావం అప్పటికే మానసింహుడికి ఉండింది.

ఆ పైన జగతసింహుడు మరికొన్ని అపరాధాలు చేసి తండ్రి కోపాగ్నికి ఆజ్యం పోశాడు. అతను తండ్రితో చెప్పకుండా సైనిక శిబిరాన్ని వదిలిపెట్టి మందారణ దుర్గానికి వెళ్ళిపోయి, తండ్రి అనుమతి కూడా పొందకుండా తిలోత్తమను పెళ్ళాడాడు. పెళ్ళికి అతని బంధువులు చాలా మంది వచ్చారు. నవాబుకూతురు అయుషా సపరివారంగా వచ్చింది. పెళ్ళి మహావైభవంగా జరిగింది. పెళ్ళికి తన తండ్రిని పిలవటం గాని, ఆయన ఆశీస్సు పొందటం గాని జగతసింహుడు చెయ్యలేదు.

మానసింహుడి దృష్టిలో జగతసింహుడు రెండు తప్పులు చేశాడు. అతను తండ్రికి తెలపకుండా పెళ్ళాడటం ఒక తప్పు; వీరేంద్రసింహుడి కుమార్తెను పెళ్ళాడటం మరొక తప్పు. ఆయన దృష్టిలో వీరేంద్రసింహుడూ, అతని కూతురూ కులహీనులు.

జగతసింహుడి నేర పరంపర తిలోత్తమను పెళ్ళాడటంతో ఆగలేదు. మొగలాయి సేనలు పాట్నాకు తరలి వెళ్ళేటప్పుడు, అతను అక్కడికి వెళ్ళి సైనికాధికారిగా తన బాధ్యత లేవీ నిర్వర్తించ లేదు. అసలతను



అక్కడికి వెళ్ళనైనా లేదు. అంతే కాదు, అతను భార్యతో ఆనందంలో ఓలలాడుతూ, దారుకేశ్వర తీరాన దిక్కు లేకుండా పడి ఉన్న తన సేనను గురించి నెల రోజులు ఉపేక్ష వహించాడు.

కొడుకు చేతలన్నీ, తలుచుకుంటే మాన సింహుడి ఆగ్రహం మిన్ను ముట్టింది. అతనికి రాజదండన జరిగి తీరాలని ఆయన నిశ్చయించాడు. అందుచేతనే ఆయన అందరూ వింటుండగా తన భటులకు, "జగతసింహుణ్ణి గాని, అతని శవాన్ని గాని పట్టుకురండి," అని కఠోరమైన ఆజ్ఞ యిచ్చాడు. వారు వచ్చి శైలేశ్వర మందిరం వద్ద అతన్ని పట్టుకున్నారు. ఏ శైలేశ్వర మందిరం దగ్గిర జగతసింహుడి ప్రణయ కథ ఆరంభమయిందో అక్కడే అంతం కూడా అయినట్టు కనబడింది.



పాట్నాలో మానసింహ మహారాజు తన కొడుకును బహిరంగంగా విచారించటానికి దర్బారు జరిపాడు. విచారణ వినటానికి వేలాదిగా జనం వచ్చి కూర్చున్నారు. మాన సింహుడు ఎత్తయిన ఆసనం పైన కూర్చున్నాడు. ఆయన కిరు పక్కలా ముఖ్య రాజోద్యోగులు ఇతర ఆసనాల పైన కూర్చున్నారు. సభ జనంతో కిటకిటలాతున్నా నిశ్శబ్దంగా ఉంది. అందరి మనస్సులలా భయాందోళనలతో నిండి ఉన్నాయి.

"బందిని తీసుకురండి," అని మాన సింహు డాజ్ఞాపించాడు.

మధ్యవయసు గల భటుల మధ్య తల వంచుకుని నడుస్తూ జగతసింహుడు వచ్చి తన తండ్రి ఎదట నిలబడ్డాడు. మానసింహు డతన్ని "బందీ" అని సంబోధిస్తూ, అతను తన కుటుంబ విషయం లోనూ, రాజకీయంగానూ అనేక అపరాధాలు చేశాడనీ, ముందు అతను తన వంశానికి చేసిన అపరాధాలు విచారించి ఆ తరవాత రాజకీయ ద్రోహాలు విచారిస్తాననీ అన్నాడు.





వృద్ధుడైన మొగలాయీ సభికు డొకడు లేచి, "మహారాజా, ఈ కుర్రవాడి అపచారాలు క్షమించమని వేడుకుంటున్నాను. కుటుంబ విషయాలను గురించి బహిరంగంగా కాకుండా, రహస్య విచారణ చేయటం మంచిదేమో!" అన్నాడు.

"లేదు, లేదు. బందీ చేసిన కుటుంబ ద్రోహలకూ, రాజకీయ ద్రోహలకూ సంబంధం ఉన్నది. ఎవరూ వెళ్ళిపో నవసరం లేదు," అన్నాడు మానసింహుడు.

మానసింహుడు విచారణ ప్రారంభిస్తూ, ముద్దాయిని, "నేను వెయ్యబోయే ప్రశ్నలకు నిజమైన సమాధానాలు చెప్పకపోతే నీ అపరాధం మరింత ఎక్కువగా పరిగణించ బడుతుంది," అన్నాడు.

దానికి జగతసింహుడు గర్వంతో, "మహారాజా, ఆ మాట చెప్పటం అనావశ్యకం. జగతసింహుడు తన ప్రాణం కాపాడుకోవటానికి కూడా అబద్ధం చెప్పడు," అని జవాబిచ్చాడు.

"నీవు వీరేంద్రసింహుడి అంతఃపురం లోని ఒక గదిలో ఒక స్త్రీతో బాటు పఠానులకు చిక్కి బందీ వైన మాట నిజమేనా?"

"నిజమే."

"నీవు పఠానుల వశమందున్న కాలంలో కతలూఖాన్ కూతురైన అయిషా హృద



యంలో నీపై ప్రేమ రగుల్కొల్పిన మాట నిజమేనా?"

"ఆ ప్రశ్నకు దీర్ఘంగా సమాధానం చెప్పాలి. నవాబునందిని అయిన ఆయుషా నాకు మేలు చేసిన మనిషి. నేను చావు బతుకుల మధ్య ఉన్నప్పు డామె నాకు తల్లి లాగా, చెల్లెలు లాగా, భార్య లాగా స్నేహితురాలి లాగా సమస్తమైన ఉపచారాలూ చెయ్యని పక్షంలో ఇవాళ నా విచారణ ఇక్కడ జరగటం సాధ్యం కాకపోను! ఆమెను దేవత లాగానూ, కపటం లేని ఆప్తురాలి లాగానూ భావిస్తాను. ఆమె పట్ల నాకు మరొక విధమైన భావం లేదు. కాని దురదృష్ట వశాన నవాబునందిని నన్ను ప్రేమిస్తున్నట్టు ఒక సందర్భంలో నాకు తెలిసింది. అది తెలిశాక, ఆమె ప్రేమను ఏ విధంగానూ స్వీకరించ లేనందుకు నేను చాలా బాధపడ్డాను."

"ఆమె కారణంగా నీకూ, పఠాన్‌సేనాని అయిన ఉస్మాన్ ఖాన్‌కూ ద్వంద్వయుద్ధం జరిగిందా?"

"ఉస్మాన్ ఖాన్ ఆయుషాను ప్రేమించాడు. ఆమె ప్రేమకు పాత్రులైనవా రిద్దరుండరాదనీ, అందుచేత నేను తనతో యుద్ధం చెయ్యాలని అన్నాడు. నేను యుద్ధం చెయ్యలేదు."





"అప్పుడప్పుడూ నవాబు కూతురికి ఉత్తరాలు పంపావా?"

"ఒక్క సారే పంపాను."

"నీ అంతట నీవే ఆమెను చూడటానికి వెళ్ళావా?"

"వెళ్ళాను. వెళ్ళిపోయేటప్పు డామె నొక సారి చూసి పోదామని వెళ్ళాను."

"ఆమె నిన్ను చూడకుండానే పంపించే సింది, కదూ?"

"అందు కొక కారణం ఉన్నది."

"ఇంత అయాక కూడా నీవు నవాబు నందినిని ప్రేమించ లేదనీ, ఆమె మాత్రమే నిన్ను ప్రేమించిం దనీ అంటావా?"



"ఉన్న సంగతి చెప్పాను. నమ్మటమూ, మానటమూ మహారాజుగారి ఇష్టం."

"వీరేంద్రసింహుడి కూతురు నీ ఉంపుడు గత్తెనే?"

జగతసింహుడు ఈ మాటకు చలించిపో యాడు. అతని శరీరంలో విద్యుత్తు ప్రవ హించి నట్టయింది.

"మహారాజా, మీరు శాసనకర్తగా, రాజుగా, ప్రత్యేకించి నాకు తండ్రిగా గౌర వించ తగ్గవారు. ఈ మాటే మరొకరు అని ఉన్నట్టయితే వాణ్ణి చీలికలూ, వాలికలూగా చేసి ఉండేవాణ్ణి. వీరేంద్రసింహుడి కుమార్తె నా భార్య—అగ్ని సాక్షిగా పెళ్ళాడిన ధర్మ పత్ని!" అన్నా డతను.

మానసింహుడు కోపోద్రేకంతో భయం కరంగా అయిపోయి, "రాజపుత్ర వంశానికి కళంకం తెచ్చిన అధముడా! ఒళ్ళు తెలి యక ఇలా అన్నందుకు నీ నాలుక వెయ్యి చీలికలు చేసినా పాపం లేదు. సిగ్గు చేత పోక నీ ప్రాణా లింకా నిలబడి ఉన్నాయా? వీరేంద్రుడి కూతురు నీకు ధర్మపత్నా? ఆ వీరేంద్రసింహుడు ఒక దాసీముండ కోసం నీళ్ళు మోసేవాడి లాగా నా అంతఃపురంలో ప్రవేశించాడు; పట్టుబడి, ఒక జారిణికి పుట్టిన విమల అనే దాన్ని పెళ్ళి చేసు

కున్నాడు—ఆ నీచుడా నీకు మామ? ఆ నీచ జాతి విమల నీకు సవతి అత్తగారా? నీ ధర్మపత్ని ఎటువంటి దానికి పుట్టింది? అది ఎవరి మనమరాలు? నీ భార్య మాతామహుడు శశిశేఖరుడు అనే వాడు చేయరాని పనులన్నీ చేసి, ఇప్పుడు సన్యాసి అయి, పరమ జ్ఞాని లాగా తిరుగుతున్నాడు—అభిరామస్వామి! ఈ నీచు లందరూ ఇప్పుడు నీకు బంధువర్గమా? నీ వివేక మేమయింది? ఆ వీరేంద్రసింహుడి కుమార్తె నీ ఉంపుడుగత్తె అని చెప్పుతున్నా నీలో దోష మంతగా కనిపించేది కాదేమో! నన్ను శత్రువు కింద జమకట్టి, నా అనుమతి గాని, ఆశీస్సు గాని లేకుండా ఈ పెళ్ళి చేసుకున్న నీవు నా కొడుకువు కావు. మానసింహుడి కొడుకు నని నీ వెక్కడన్నా చెప్పుతున్నావో నీకు మరణ దండన తప్పదు," అన్నాడు.

సభికు లందరూ దిగ్భ్రమ చెంది కొయ్యబొమ్మల్లాగా మానసింహుడు చెప్పేది వింటున్నారు. కొంచెంసేపు ఆగి ఆయన జగతసింహుడి రాజకీయ నేరాలను విచారించ నారంభించాడు.

"నీ రాజకీయాపరాధాలను గురించి కొన్ని ప్రశ్న లడుగుతాను. నీవు పాదుషా సేవకుడవై వుండీ, ప్రత్యేకించి ఒక కార్య



భారాన్ని మీద వేసుకున్న సేనాపతివై ఉండీ కూడా, ఇతరుల దుర్గం లోకి, దుర్గాధిపతి అనుమతి లేకుండా, రాత్రి వేళ దొంగ లాగా ప్రవేశించావా లేదా ?"

జగతసింహుడు తల వంచుకుని సమాధానం చెప్పలేదు.

"నీ అయిదువేల సేననూ, పఠానులను తరిమివేసే పనిని విడిచి పుచ్చి, ఒక స్త్రీ కోసం నీ పక్కడికి వెళ్ళావా లేదా ?"

జగతసింహుడు మాట్లాడలేదు.

"పఠానులు నిన్ను విడిచిపెట్టాక నీవు సైనిక శిబిరానికి వెళ్ళి, నా ఉత్తరువుల కోసం అక్కడ ఎందుకు వేచి ఉండలేదు?"

జవాబు లేదు.

"సేనాధిపతు లందరూ శిబిరం ఎత్తేసి, తమతమ సేనలను తీసుకుని బయలుదేరు తుంటే, వారి వెంట నీ వెందుకుండలేదు?"

జవాబు లేదు.

"ఎవరి ఉత్తరువూ లేకుండా, పాదుషా వారి పని ఒక్కటీ చెయ్యకుండా నీ ఇష్టం వచ్చి నట్టు కాలం ఎందుకు గడిపావు? మాట్లాడవేం? దుర్మార్గుడా, నీ వంటి వాడికి మరణ శిక్ష తప్ప వేరే దండన ఏ ముంటుంది?"

వృద్ధుడైన మొగలాయీ మళ్ళీ లేచి, "హుజూర్, క్షమించండి. ఒక విజ్ఞాపన. యువరాజు మీ కొడుకు—" అని ప్రారంభించాడు.

"ఈ నీచుడు నా కొడుకన్నవా రెవరు? వీడికీ నాకూ కొడుకూ తండ్రీ సంబంధం లేదని ముందే చెప్పాను," అన్నాడు మాన సింహుడు తీవ్రంగా.

"సరే మీరు ధర్మం ఎరగరా? యువ రా జింకా పసివాడు!" అంటూ మొగలాయీ వృద్ధుడు కూర్చున్నాడు.

మానసింహుడు కాస్సేపు తలవంచుకుని ఆలోచించి, "నిజమే, ద్రోహితుడా, నీకు సరి అయిన శిక్ష మరణ దండనే! అయినా నీ వయసును పాటించి నీకు యావజ్జీవ కారాగార శిక్ష విధిస్తున్నాను," అన్నాడు. ఆయన భటులతో, "ఇతడి నగలూ, దుస్తులూ తీసేసి, బందీ దుస్తులు తొడిగి నా ఎదటనే అతడి కాళ్ళకూ, చేతులకూ సంకెళ్ళు తగిలించి, అందరూ చూస్తుండగానే కారా గృహానికి తీసుకు పొండి," అన్నాడు.

భటులు జగతసింహుడి దుస్తులు మార్చి, సంకెళ్ళు తగిలించి తీసుకుపోతుంటే సభలో కలవరం పుట్టింది. సేనాపతులు తలలు వంచుకున్నారు, వృద్ధులు కంట తడి పెట్టారు. జగతసింహుడు కనుమాటు కాగానే సభ లేచింది. —(ఇంకా వుంది)





# నవాబు నందిని

## 3

మహాసింగు పంపగా దారుకేశ్వరానికి బయలుదేరిన సైనికుడికి మందారదుర్గ మార్గంలో గజపతిదిగ్గజుడు కనిపించి, "అల్లా మహాదేవుడు హుజూర్ వారి ఆరోగ్యాన్ని కాపాడు గాక!" అన్నాడు.

దిగ్గజుడి భాషా, వాలకమూ చూసి ఆశ్చర్యపడి సైనికుడు తన గుఱ్ఱాన్ని మెల్లిగా నడిపిస్తూ దిగ్గజుణ్ణి సంభాషణలో పెట్టాడు. సైనికుడి ప్రశ్నలకు సమాధానంగా దిగ్గజుడు, మొదట తాను హిందువుణ్ణనని, తరవాత తాను ముసల్మానుగా మారిపోయినట్టు తెలిసిందని, తిరిగి హిందువుడు కావటానికి చెయ్యవలిసిందంతా చేశాననీ, అయినా తన జాతి గురించిన అనుమానం గురువుగారు చెబితేగాని పోదనీ, కోటలో ఉండే ఆస్మాని తనకు చాలా ఆప్తురాలని చెప్పాడు.

ఇలా మాట్లాడు కుంటూ వారు మందారణదుర్గాన్ని సమీపించారు. సైనికుడు దిగ్గజుడితో, "యువరాజు జగతసింహుడు బందీ అయినట్టు కోటలో చెబుతావా?" అని అడిగాడు.

"ఎందుకు బందీ? ఎవరికి బందీ?" అని దిగ్గజుడు ప్రశ్నించాడు.

"ఎందుకు బందీ అంటే చెప్పలేను. కాని అతన్ని బందీగా పట్టుకున్నది మేమే. అలా చెయ్యమని మానసింహమహారాజు మా కాజ్ఞ ఇచ్చారు," అన్నాడు సైనికుడు.

దామోదరముఖర్జీ



దిగ్గజుడికి గుండెలో రాయి పడింది. వెనక ఇలాగే వీరేంద్రసింహుడు బందీ అయినప్పుడు, కోటలో ఉన్నవారంతా బందీ లయిపోయారు. చాలా గొడవ జరిగింది. ఇప్పుడు శత్రుసైనికులు జగతసింహుణ్ణి పట్టారు. తాను చూసినవాడు మొదటి సైనికుడన్న మాట. మిగిలినవాళ్ళు వెనకగా వచ్చిపడి కోటలో ఉన్న వాళ్ళందరినీ పట్టేస్తారు. సందేహం లేదు. ముందు ఈ సైనికుణ్ణి వదిలించుకుని, కోటకు వెళ్ళి ఈ దారుణవార్త అందరికీ చెప్పాలి.

ఇలా అనుకుని దిగ్గజుడు సైనికుడితో, "ఈ మాట నేను కోటలో చెబుతాను. మీరు వెళ్ళి మరో పని చూసుకోండి," అన్నాడు. సైనికుడు వెళ్ళిపోయాడు.

దిగ్గజుడు కాలి సత్తువ కొద్దీ పరిగెత్తుకుంటూ కోటలో ప్రవేశించి, అస్మానికి ఈ వార్త చెప్పాలనే ఉద్దేశంతో అంతఃపురం ప్రవేశించబోయాడు. కాని ద్వారపాలకుడతన్ని లోపలికి వెళ్ళనివ్వలేదు.

తాను అక్కడివాణ్ణేననీ, అభిరామస్వామి శిష్యుణ్ణనీ, అస్మానిని తాను బాగా ఎరుగుదుననీ దిగ్గజు డన్నాడు.

"అయితే ఇక్కడే ఉండు. ఎవరైనా కనిపిస్తే లోపలికి కబురు చేస్తాను," అన్నాడు ద్వారపాలకుడు.

విమల అంతఃపురం పై అంతస్తులోని కిటికీ తెర వెనక నుంచి ద్వారపాలకుడికీ, దిగ్గజుడికీ జరిగే వాగ్వాదమంతా గమనిస్తున్నది. ఆమె అందమూ, చురుకూ, అలంకారాలూ అన్నీ పోయాయి. శరీరం క్షీణించింది. వార్ధక్య లక్షణాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

విమల ఉన్న చోటికి అస్మానీ కూడా వచ్చింది.

"గజపతి దిగ్గజుడు ద్వారపాలకుడితో ఘర్షణ పడుతున్నాడు. వెళ్ళి అతన్ని తీసుకురా," అన్నది విమల అస్మానీతో.

అస్మానీ కిందికి దిగి వెళ్ళి ఒక చీకటింట ప్రవేశించి, దిగ్గజుణ్ణి పిలుచుకు రమ్మని లక్ష్మణి అనే ఒక దాసీని ద్వారం వద్దకు పంపింది.

లక్ష్మణి వెళ్ళి, "ఏం రసికరాజా, జ్ఞాపకం ఉన్నానా?" అని అడిగింది.

ఆమె నెన్నడూ చూసి ఉండని దిగ్గజుడు చాలా కంగారుపడి, "నిన్ను చాలా సార్లు చూశాను, బాగా ఎరుగుదును. కాని ఎవరివో గుర్తురావడం లేదు," అన్నాడు.

లక్ష్మణి అమాయకుడైన దిగ్గజుణ్ణి కాస్సేపు ఏడిపించి, అస్మానీ ఉన్న చోటికి తీసుకుపోయింది.

"ఏం రసికరాజా, ఇంతకాలం ఏ మయావు? ఎక్కడ ఉన్నావు?" అని అస్మానీ అడిగింది.

"అదంతా తరవాత చెబుతాను గాని, ముందు వెంటనే నాతో బయలుదేరు. ఇక్కడ ఉండటం—చాలా ప్రమాదం," అన్నాడు దిగ్గజుడు.

"ఏమిటా ప్రమాదం?"

"యువరాజును పట్టుకు పోయారు!"

"ఎవరు?"

"మానసింహుడి మనుషులు."

"ఎక్కడ?"



"దారిలో పోతూంటే. ఇక దుర్గంలో వారంతా బంది లవుతారు. నేను నీ గురించే బెంగ పడుతున్నాను. వెంటనే వచ్చెయ్యి. ఏమైనా పారిపోదాం!"

ఈ వార్త విమలకు వెంటనే చెప్పాలి. అందుకని అస్మానీ దిగ్గజుడితో, "నువ్వన్నది నిజమే. పారిపోదాం. నువు ముందు పద. చీకటి పడగానే సామాన్లు తీసుకుని పోదాం," అన్నది.

"అంతదాకానా? ఆలస్యం వల్ల అపాయం."

"నువు ఆశ్రమానికి వెళ్ళి అక్కడి వాళ్ళతో మానసింహుడి మనుషులు రెండు

గంటల్లో వచ్చి పడబోతున్నారని చెప్పు. సమయానికి నేను వచ్చి నిన్ను అక్కడ కలుసుకుంటాను."

అస్మానీ ఈ మాట అనగానే దిగ్గజుడికి కంపరం పుట్టి, వణుకుతూ, "అలా అయితే నే నిప్పుడే ఆశ్రమానికి పోతున్నాను," అంటూ పరుగు తీశాడు.

త్వరలోనే దిగ్గజుడు తెచ్చిన దుర్వార్త దుర్గ మంతటా తెలిసిపోయింది. దిగ్గజుడు చెప్పిన వివరాల వల్ల ఏమీ బోధపడక, నిజం తెలుసుకు రమ్మని అభిరామస్వామి ఒక మనిషిని గుర్రం మీద పాట్నాకు పంపాడు.

చీకటి పడ్డాక విమలా, అస్మానీ కలిసి అభిరామస్వామి కుటీరానికి వచ్చారు. అభిరామస్వామి జింకచర్మం మీద కూర్చున్నాడు. ఆడవా ళ్ళాయన కెదురుగా నేల పైన కూర్చున్నారు.

"ఇప్పు డేం చెయ్యాలి?" అని విమల అడిగింది.

"ఒకనాడు ఇదే చోట ఇలాటి మాటే అడిగావు, జ్ఞాపకం ఉన్నదా? ఆ వివాహానికి మానసింహుడు ఒప్పడని నే నంటే, యువ రాజు స్వతంత్రుడని నీ వన్నావు. ఆ స్వాతంత్ర్యం ఎక్కడికి దారి తీసిందో చూశావా? యువరాజుకు ఎన్నడూ ఎలాటి



స్వాతంత్ర్యమూ లేదు. అతను తండ్రికి ఇష్టం లేని పని ఏదీ చెయ్యలేడు. అతను మానసింహుడి కొడుకు మాత్రమే కాదు, ఆయన కింది నౌకరు కూడా," అన్నాడు అభిరామస్వామి.

"ఈ సంగతి ఇప్పుడు గద తెలిసింది! ఒక వేళ అనాడే తెలిసినా కూడా ఆ ప్రేమ ప్రవాహన్ని ఆపటం ఎవరికి సాధ్యమవుతుంది? తిలోత్తమను గురించి మీకు తెలీదు, నాకు తెలుసు."

"నేను తెలుసుకోవలసిం దేమీ లేదు. ఒక్కసారి చూసుకున్నంత మాత్రాన ప్రగాఢ ప్రేమ పుట్టుకొస్తుం దంటే నేను నమ్మను. అది మోహం మాత్రమే. మోహం కూడా బలవత్తరమైనదే, కాని దాన్ని మొగ్గలోనే తుంచి పారేస్తే అందు వల్ల ప్రమాదం ఉండదు. నీ కథంతా తెలుసు నను కున్నాను."

"నేను తిలోత్తమకు సుఖమూ, ఆనందమూ చేకూర్చాలని అలా చేశాను. నేను తిలోత్తమ కోసమే బతికాను. నాకు తిలోత్తమ రెండో ప్రాణం. ఆ పిల్ల కష్టాలన్నీ గట్టెక్కి సమస్త సుఖాలూ ఒనగూడాయను కుంటే ఆమె మళ్ళీ శోకసముద్రంలో పడిపోయింది. నా దుఃఖాన్ని ఎవరితో చెప్పకోను? నేను చేసిన ఏ పొరపాటు చేత





ఆమెకి దుఃఖం వచ్చిపడిందో చెబితే పశ్చాత్తాప పడతాను," అన్నది విమల.

ఆమె చేసిన ప్రతి పనీ తప్పేనని అభిరామస్వామి చెప్పాడు. మానసింహుడి కొడుక్కూ వీరేంద్రసింహుడి కూతురితో మనువు పొసగదని విమలకు రూఢిగా తెలుసు. అందుచేత ఆమె తిలోత్తమ హృదయంలో రేకెత్తిన ఆశను వెంటనే తుంచి పారెయ్యవలిసింది. ఆమె అలా చేయులేదు. శైలేశ్వర మందిరం నుంచి మొదటిసారి వెళ్ళిపోయే టప్పుడు జగతసింహుడికి తిలోత్తమ ఎవరో తెలియదు. అత నలాగే వెళ్ళిపోతే ఇంత జరిగేది కాదు. విమల



అతన్ని పదిహేను రోజుల అనంతరం అక్కడికి రమ్మనీ, అప్పుడు తిలోత్తమ గురించి చెబుతాననీ మాట ఇచ్చింది. అది పొరపాటు. ఆ తరవాత ఆమె అభిరామస్వామి హెచ్చరికను కూడా తృణీకరించి జగతసింహుణ్ణి రెండవసారి కలుసుకుని, తిలోత్తమ సంగతి చెప్పేసింది. అతనికి తిలోత్తమను చూపిస్తానని మాట ఇవ్వటం మరో తప్పు. ఆమె వీరేంద్రసింహుడి భార్య అవుగాక, మొగలాయి సేనాపతిని రహస్యంగా దుర్గం లోకి ప్రవేశ పెట్టే అధికారం ఆమెకు లేదు. అందువల్ల దుర్గం పఠానుల వశమై, అనేక దుష్ఫలితాలు కలిగాయంటే అందుకు బాధ్యత అంతా విమలదే.

"ఆలోచించుకో. నీవు చేసిన ఒక్క పనీ మంచిది కాదు," అన్నాడు అభిరామస్వామి చివరకు.

విమల తన తండ్రి అయిన అభిరామస్వామి కాళ్ళపైన పడి, "అర్థమయింది. అన్నీ పాడు పనులే చేశాను. ఇప్పుడు ఉపాయం ఏదైనా ఆలోచించి మమ్మల్ని కాపాడండి," అన్నది.

"నేనూ అదే ఆలోచిస్తున్నాను. నేను పంపిన మనిషి తిరిగి వచ్చిన దాకా ఏమీ చెయ్యటానికి లేదు. మానసింహుడికి కొడుకు





పైన ఏ విషయమై ఆగ్రహం కలిగిందీ తెలిసిన మీదటనే మనం ఏ ఉపాయమైనా చేసేది," అన్నాడు అభిరామస్వామి.

"ఆ మనిషి ఎంత కాలానికి తిరిగి వస్తాడు?"

"రేపే రావచ్చు. పాట్నా దాకా వెళ్ళవలసి వస్తే అతను రావటానికి వారం, పది రోజులు పట్టనూ వచ్చు."

"ఎనిమిది పది రోజులే! అంత దాకా తిలోత్తమ ఎలా బతికి ఉంటుంది?"

"నీవు ఆమెకు ధైర్యం చెప్పు. రేపు ఉదయం నేను కూడా వచ్చి మాట్లాడతాను," అన్నాడు అభిరామస్వామి.

"మానసింహుడు కన్న కొడుకని దయ దలచకపోతాడా?" అన్నది విమల.

"ఆత్మాభిమానం జాస్తిగా గల వాడికి కొడుకని ఏమిటి? అయినవాళ్ళని ఏమిటి?"

"చివరకేమవుతుందంటారు?"

"అడదానివి. నీకీ విషయాలు తెలియకుండా ఉండటం మంచిది."

"మీ రంటే మానసింహుడికి గౌరవమనుకుంటాను. మీరు వెళ్ళి చెబితే లాభం ఉంటుందేమో?"

"అలాటిదేమీ ఉంటుందనుకోను. నేను జోక్యం కలిగించుకుంటే పరిస్థితి మరింత విషమించ వచ్చు. మానసింహుడు గౌరవించే మనిషి ఎవరైనా చెప్పాలి...చాలా పొద్దుపోయింది. ఇప్పుడు మీరు వెళ్ళిపోయి రేపు ఉదయం రండి," అని అభిరామస్వామి విమలనూ, అస్మానినీ పంపేశాడు.

పాట్నాకు వెళ్ళిన మనిషి సమాచారమంతా పోగుచేసుకుని తిరిగి వచ్చాడు. యువరాజుకు యావజ్జీవ కారాగార శిక్ష విధించారని తెలియగానే దుర్గంలో అందరూ హతాశులైపోయారు.

అభిరామస్వామి ఏదో నిశ్చయానికి వచ్చి, తాను తీర్థయాత్రల మీద వెళుతున్నట్టు ప్రకటించి బయలుదేరి వెళ్ళాడు.

కాని, ఆయన ఏదో ప్రయత్నం మీద వెళు తున్నాడని విమల గ్రహించింది.

తిలోత్తమ పూర్తిగా కుంగిపోయింది. ఆమెకు నిద్రాహారాలు లేవు, స్నానమూ, అలంకరణలూ లేవు. దుఃఖసాగరంలో పడి కొట్టుకుంటూ కటిక నేలపై పడి దొర్లు తున్నది. యువరాజు పది రోజులుగా కారా గృహ వాసం చేస్తున్నాడు; అతని భార్య అయిన తిలోత్తమ అతని కన్న కూడా దీనా వస్థలో ఉన్నది. తియ్యని కల లాటి సుఖం ఇట్టె కరిగిపోయింది. ఈ సారి ఆమెకు కలిగిన దుఃఖానికి అవతలి ఒడ్డు లేదు. తన భర్త జీవితాంతం దాకా తనకు మరి కనిపించడు.

ఇలాటి పరిస్థితి ఒక్కొక్కప్పుడు మను షుల చిత్తవృత్తిని పూర్తిగా మార్చేస్తుంది. ఎల్లప్పుడూ పరిస్థితులకు తల ఒగ్గి, అసహా యురాలుగా ఉండిన తిలోత్తమలో ప్రతీకార బుద్ధి తలఎత్తింది. తాను ఎంత ఏడ్చినా తన భర్తకు కించిత్తు కూడా ప్రయోజనం ఉండదు. ఏదైనా చెయ్యదలిస్తే అతని కష్టాలు తొలగించే ప్రయత్నమే చెయ్యాలి.

తిలోత్తమ చప్పున లేచి కూర్చుని, "ఎవరక్కడ?" అని పిలిచింది. ఆమె పిలుపు విని ఒక దాసి వచ్చింది. దాసి చేత కలమూ, కాగితమూ తెప్పించి, తిలోత్తమ ఆయుషాకు ఒక ఉత్తరం రాసింది. అందులో ఆమె, మానసింహుడి చేత తన భర్త అయిన జగతసింహుడు యావజ్జీవ కారాగార శిక్ష విధించబడటం గురించి రాసి, "ఈ ప్రపం చంలో యువరాజు క్షేమం కోరే వారిలో నీవు అగ్రగణ్యురాలి వని భావించి నీకీ ఉత్తరం రాస్తున్నాను. అందు గురించి నీ వేమి చేయుగలవో, ఏమి చేస్తావో నాకు తెలియదు," అని రాసింది.

తరవాత తిలోత్తమ ఆ ఉత్తరానికి దారం కట్టి, సీలువేసి, దాన్ని తీసుకుని గది నుంచి వెళ్ళిపోయింది. —(ఇంకావుంది.)






## 4

ఇప్పుడు పఠానులు ఒరిస్సా దేశానికి ఏలికలై, స్వర్ణదుర్గం రాజధానిగా చేసుకుని ప్రశాంతంగా కాలక్షేపం చేస్తున్నారు. కతలూ ఖాన్ అనంతరం అతని వారసులైన సులేమాన్‌ఖానునూ, ఉస్మాన్‌ఖానునూ కూడా నవాబులుగా ప్రకటించి రాజ్య భారం ముసలి వజీరైన ఈసాఖాన్ పైన మానసింహు డుంచి, రాజ్యతంత్రం ఏర్పాటు చేసి వెళ్ళిపోయాడు.

నవాబులుగా పరిగణించబడుతున్న సులేమాన్‌ఖాన్‌కూ, ఉస్మాన్‌ఖాన్‌కూ మనస్తత్వాలలో చాలా తేడా ఉన్నది. సులేమాన్ తాగుబోతు, భోగలాలసుడు. ఉస్మాన్ ఖాన్ వీరోచిత స్వభావుడు; పఠాన్ రాజ వంశంలో పుట్టి కత్తిపట్టి యోధు డనిపించు కోకుండా తాగి తందనాలాడటం చాలా హీనమని అతని ఉద్దేశం.

మొగలాయీలే ఇప్పుడు భారత దేశానికి పాలకులుగా ఉండటం ఉస్మాన్ సహించలేకపోయాడు. బాబరు కాలంలో పఠానుల సామ్రాజ్యం కాస్తా మొగలాయీల దయింది. అది తిరిగి పఠానులకు చెందదని ఏమున్నది? ఉస్మాన్‌కు ఇటీవల జరిగిన సంధి కూడా అసంతృప్తినే కలిగించింది.

ఉస్మాన్ మనసును కలత పెడుతున్న మరొక విషయం ఆయుషా. ఆత నామెను

దామోదర ముఖర్జీ





గాఢంగా ప్రేమించాడు. ఆయుషా కతలూఖాన్ సొంత కూతురు కాదు, పెంపుడు కూతురు. కతలూఖాన్ యొక్క కాశ్మీరు బేగముకు ఆయుషా అన్న కూతురు. ఆయుషా ఆరునెలల బిడ్డ అయి ఉండగా ఆమె తల్లి మరణించింది. ఆమె తండ్రి ఆమెను తన చెల్లెలి చేతిలో పెట్టాడు. ఆ తరవాత కొద్ది కాలానికి ఆయన కూడా గతించాడు. అది మొదలు ఆయుషా కతలూఖాన్ సొంత కూతురి లాగే పెరిగింది—అంతకంటె కూడా గారాబంగా పెరిగిందనవచ్చు; అతడు ఆమెకు ప్రత్యేకించినంత ధనం తన సొంత పిల్లలలో ఎవరికీ ఇవ్వలేదు.

అయుషా ఉస్మాన్‌లు ఒకే వయసువాళ్ళు. కలిసి మెలిసి పెరిగారు. వారి చిన్ననాటి స్నేహం పెద్దయాక ఉస్మాన్‌లో ప్రేమ భావంగా పరిణమించింది. ఆయుషా మాత్రం ఉస్మాన్‌ను తన సొంత అన్న లాగే చూసుకుంటూ, అప్యాయంగా ఉండేది. ఆమె తనను ప్రేమించటం లేదనీ, జగతసింహుణ్ణి ప్రేమించిందనీ తెలిసినప్పటి నుంచీ ఉస్మాన్‌ఖాన్ తన ప్రేమాగ్నిని తనలోనే దాచుకుని, దహించుకుపోతూ వస్తున్నాడు.

ఒకనాటి అపరాహ్ణం ఉస్మాన్‌ఖాన్ ఒక విశాలమైన గదిలో కూర్చుని ఉండగా అక్కడికి ముసలి వజీరు ఈసాఖాన్ వచ్చాడు. ఇద్దరూ పరస్పరం మర్యాదలు జరుపుకుని కూర్చున్నాక, "ఏం పని మీద వచ్చారు?" అని ఉస్మాన్‌ఖాన్ వజీరు నడిగాడు.

"జగతసింహుడికి ఖైదు శిక్ష విధించినట్టు వినే ఉంటారు," అన్నాడు వజీరు.

"విన్నాను. అందువల్ల మనకు ఒరిగేదేమిటి?" అని ఉస్మాన్ అడిగాడు.

"మానసింహ మహారాజు మనతో చేసుకున్న సంధి అక్బరుపాదుషాకు నచ్చలేదని తెలుస్తున్నది. అందుచేత పాదుషా ఏదో ఒక వంకపెట్టి మనతో చేసుకున్న సంధిని రద్దు చెయ్యవచ్చు."





"దీనికీ, జగతసింహుడికి విధించబడ్డ శిక్షకూ సంబంధ మేమిటి?"

"సంబంధం ఉన్నదను కుంటాను. వెనకటి లాగా జగతసింహుడు మనకు పరమ శత్రువు కాడు. అతనికి మన పట్ల కొంత అభిమానం ఉండే అవకాశం ఉన్నట్టు నేను భావిస్తున్నాను," అన్నాడు వజీరు.

ముసలివాడు లౌక్యంగా ఆయుషాను సూచిస్తున్నా డని ఉస్మాన్ గ్రహించాడు. జగతసింహుణ్ణి ఆయుషా ప్రేమిస్తున్నప్పుడు అతనికి పఠానుల పై శత్రుభావం ఉండదని వజీరు సూచన. ఈ సంగతి గ్రహించగానే ఉస్మాన్‌కు తేళ్ళు కుట్టినట్టు బాధ కలిగింది.

"జగతసింహుడు మన మంచి కోరి, అక్బరు పాదుషాతో చెప్పి, ఇప్పు డున్న సంధికి భగ్నం రాకుండా కాపాడగలిగి ఉండేవా డని మీ ఉద్దేశం. అవునా?"

వజీరు అవు నన్నాడు.

"ఈ సంధి పట్ల మీకు ఆదరం ఉండ నవసరం లేదు. దాదాపు బెంగాలు సంతా జయించిన మనం అంతా పోగొట్టుకుని, పూరిజగన్నాథం కూడా మొగలాయీలకు ధారాదత్తం చేసేశాం. అక్బరు ఈ సంధిని రద్దుచేస్తే మనం విచారించ నవసరంలేదు," అన్నాడు ఉస్మాన్.

వజీరు కొంచెం ఆలోచించి, "అందు గురించి నేను తమతో చర్చించను. కాని ప్రస్తుతం మనం చాలా దుర్బలులమై ఉన్నాం," అన్నాడు.

"నిజమే. మానసింహుణ్ణి ఎదిరించి నిలబడగల బలశాలి ఎవడూ మనలో ఇప్పుడు లేడు. దాని కేమైనా ఉపాయం చేస్తారా?"

"నాకు మామూలు రాజకార్యాలతోనే సరిపోతున్నది."

"వాటినే చూసుకుంటూ ఉండండి. ఈ వయసులో మీరు యుద్ధపు గొడవలు పెట్టుకోలేరు. మీ వయసులో బుద్ధి సంధినీ,



శాంతినీ కోరుతుంది. ఈ సంధి ప్రస్తుతానికి అనుకూలించినా, అవమానకరమనే నా అభిప్రాయం. దీన్ని భగ్నం చేసి మొగలాయీలతో తలపడి పోరాడాలని నా ఉద్దేశం. దానికి తగిన ప్రయత్నాలన్నీ చేసి మీకు తెలియజేస్తాను," అన్నాడు ఉస్మాన్.

"మరొక్క సంగతి. త్వరలోనే మానసింహ మహారాజు పూరిజగన్నాథ క్షేత్రానికి యాత్ర వస్తున్నారు. ఆయన మన రాజ్యంలో నుంచే ప్రయాణిస్తాడు. ఆ సందర్భంలో మన మాయనకు స్వాగత సన్మానాలు జరపవలిసి ఉంటుంది," అన్నాడు వజీరు.

ఉస్మాన్ ఉద్రేకంతో, "అసంభవం. మనం స్వతంత్రులమైన రాజులం. ఢిల్లీ పాదుషాలాటి వాళ్ళం. ఈ మానసింహుడు పాదుషా సేవకుడు," అన్నాడు.

"మనం స్వతంత్రులమైన రాజులమే అయినా ఢిల్లీ పాదుషాకు లోబడిన వాళ్ళం. ఉత్కళదేశం స్వతంత్రంగా ఉన్నది వారి దయచేతనే. అది మనం మరవరాదు."

"అస్తమానమూ శల్యంలాగా బాధిస్తూంటే ఆ విషయాన్ని మరవట మెలా జరుగుతుంది? ఈ అపకీర్తి త్వరలోనే పోగొట్టుకుంటాం లెండి," అని చెప్పి ఉస్మాన్‌ఖాన్ వజీరును పంపేశాడు.

అతను ఆలోచనానిమగ్నుడై గది నుంచి అంతఃపురం కేసి నడవ సాగాడు. అతని ఆలోచనలు ఈ ధోరణిలో నడిచాయి:

పఠానులు మొగలాయీలతో చేసుకున్న సంధి మొగలాయీలకే లాభించింది. కతలూఖాన్ ఆకస్మికంగా మరణించి ఉండకపోతే ఈ సంధి జరిగి ఉండేదే కాదు. అప్పటికి యువరాజు పఠానులకు దొరికాడు. ఒక యుద్ధంలో మానసింహుడికి ఓటమి కూడా కలిగింది. నవాబు మరణం వల్ల ఏర్పడిన అస్తవ్యస్త పరిస్థితిలో పఠానులు సంధికి ఒడబడవలసి



వచ్చిందేగాని, వారికి నిజమైన పరాజయం కలగనే లేదు.

"మానసింహుడికి స్వాగతం చెప్పటానికీ, ఆయన భోజనం వగైరా అవసరాలు చూడటానికి ఎవరినన్నా పెద్ద ఉద్యోగిని పంపుతాను. కట్నాలూ, కానుకలూ పంపను," అనుకుంటూ ఉస్మాన్‌ఖాన్ ముందుకు నడిచాడు.



అతని ఆలోచన అయుషా కేసి మళ్ళింది. జగతసింహుడు దొరికినప్పు డతన్ని చంపెయ్యకపోవటం పెద్ద పొరపాటయింది; అయుషా అతన్ని ప్రేమించింది; అతని కామెపై ప్రేమ లేకపోయినా, అతను బతికి ఉండగా అయుషా అతన్ని ప్రేమించటం మానదు; అతన్నెలాగైనా చంపెయ్యాలి.

ఇలా అనుకుంటూ అంతఃపురం ప్రవేశించిన ఉస్మాన్‌ఖాన్‌ను కాశ్మీరుబేగమ్ పిలిచి, ఒక వార్త నిలా చెప్పింది:

"పదేళ్ళ క్రితం అయుషా పినతండ్రి తన సర్వస్వాన్ని అయుషాకు రాసి చనిపోయాడు. అయుషా తరఫున ఆ ఆస్తి స్వాధీనం చేసుకోవలిసిందని పంజాబు సుబేదారు మన నవాబుగారికి కబురు పంపాడు. నవాబుగారు ఆ ఆస్తిని కనిపెట్టి ఉండమని ఇక్కడి నుంచి మనుషులను పంపారు. ఆ మనుషు లిప్పుడు తిరిగివచ్చి, అయుషా కిప్పుడు తగిన వయస్సున్నది గనక ఆమె స్వయంగా వెళ్ళి ఆస్తిని స్వాధీనపరచుకోవాలని అంటున్నారు. ఆ పని కాస్త నువు చూస్తావా?"

"అక్కడ మీ అన్నల కేం పని?"

"ఒక అన్న పంజాబులో సేనాధిపతి. ఈ ఆస్తి అయుషా కిచ్చిన అన్న జాగిరుదారు. అయుషా తల్లి సుబేదారు కూతురు."

"అయుషా తల్లి మొగలాయిదీ, తండ్రి పఠానూ అన్న మాట! అయితే కరలూ ఖాన్ పెంపుడు కూతురికి మొగల్ సుబేదారు ఆస్తి సంక్రమించటానికి అడ్డేమీ ఉండదా?"



"ఉండదు. అయిషా తండ్రి అంటే అక్బరుకు చాలా అభిమానం. అక్బరు స్వయంగా ఈ విషయమై ఆజ్ఞాపత్రం కూడా రాసి ఉన్నాడు. అయిషా అక్బరు పాదుషాకూ, అక్కడి దర్బారులో వారికీ కూడా తెలుసు."

"ఇంతకూ నేను చేయవలిసిందేమిటి?"

"అది నువే ఆలోచించు. అయిషాకు పంజాబు వెళ్ళాల నున్నది. ఆమె ఆరోగ్యం ఏమీ బాగా లేదు. స్థలం మార్పు వల్ల ఆరోగ్యం కలగవచ్చు."

"అయిషా ఆస్తి విషయం ఏదో ఒకటి చెయ్యవచ్చు. కాని అయిషా వెళ్ళిపోతే అక్కడ అంతా అంధకారమైపోతుంది," అన్నాడు ఉస్మాన్.

"అవును, నువు అయిషాను ప్రేమిస్తు న్నావు. మీ ఇద్దరికీ వివాహ మవుతుందని మేమనుకునే వాళ్ళం. ఈ మధ్య నువు ఇటు కేసి రావటమే మానేశావు. ఆమెను చూడబోతే అలా ఉన్నది."

"అమ్మా, నా తప్పేమీ లేదు. అయిషా కోసం ప్రాణాలర్పించమంటే అర్పిస్తాను. అయిషా తన గుండెలో ఏదో చిచ్చు దాచు కుని, తాను కాలిపోతూ నన్నూ, మిమ్మ ల్నందర్నీ కూడా కాల్చేస్తున్నది. నేనామె నొకసారి చూడాలి."

"రెండు గడియల క్రితం ఇక్కడే ఉన్నది. ఉద్యానవనంలో తిరగబోయిం దేమో. అయితే నువు పంజాబు ప్రయాణం మాట ఎప్పుడు చెబుతావు?"

"అయిషా అభిప్రాయం తెలుసుకుని నా అభిప్రాయం మీకు తెలుపుతాను. నాకు సెలవిప్పించండి," అంటూ ఉస్మాన్‌ఖాన్ కాశ్మీరుబేగమ్ వద్ద సెలవు పుచ్చుకుని ఉద్యానవనం కేసి వెళ్ళాడు.

అతను అయిషా కోసం క్రీడాసరోవరం మెట్ల వద్ద వెతికాడు, చంపకవృక్షం నీడ నుండే శిలాసనం వద్ద వెతికాడు, పొగడచెట్టు

కింద వెతికాడు, గులాబీ చెట్లలో వెతికాడు, అయిషా అక్కడెక్కడా లేదు. అతను ఉద్యానవనం మధ్యనున్న ఇంటి కేసి వెళ్ళాడు. ఒక దాసి అతని కెదురువచ్చి, నవాబునందిని ఆ ఇంట ఉన్నట్టు చెప్పింది.

ఉస్మాన్ అడుగులో అడుగు వేసు కుంటూ లోపలికి వెళ్ళి, అయిషా కింద పడుకుని నిద్రపోతూండటం గమనించి వెనక్కు తిరిగి వచ్చాడు. కాని అతని కేదో సందేహం తట్టింది. అతను ఆమెను చూసిన క్షణంలోనే ఆమె మీదుగా ఏదో పాకినట్టు అతనికి అనుమానం కలిగింది.

అతను దాసీ దాన్ని త్వరగా రమ్మని చేత్తో సైగ చేసి, "నవాబునందిని నిద్ర పోతున్నది. నేను లోపలికి పోవటం ఉచితం కాదు. ఆమె శరీరం పైన ఏదో పాకినట్టు కనబడింది. చూసి వస్తావా? నాకేమో భయంగా ఉంది," అన్నాడు.

దాసీది లోపలికి పోయి కంగారుగా వెంటనే తిరిగి వచ్చి, "అమ్మో, పెద్ద తాచుపాము!" అన్నది.

"కదలకు! మాట్లాడకు! అరవకు!" అని దాసీని హెచ్చరించి ఉస్మాన్ లోపలికి వెళ్ళి చూశాడు. భయంకరమైన తాచొకటి అయిషా వీపు మీదుగా ఎక్కి, ఆమె ఎడమ



పార్శ్వాన తలపెట్టి నిద్రపోతున్నది. అయిషా ఏ మాత్రం కదిలినా, ఒత్తిగిలినా పాము ఆమెను కాటు వెయ్యవచ్చు. తలుచు కుంటేనే ఉస్మాన్‌కు కంపరం పుట్టు కొచ్చింది. అతను అతి జాగ్రత్తగా పాము తోకను పట్టి, పైకి ఒక్కలాగు లాగాడు. పాముకూడా క్షణంలో ఎక్కడలేని చైతన్యమూ వచ్చి, పడగ విప్పి వెనక్కు తిరిగిచూసి, కాటువేసే ప్రయత్నంలో బుస కొట్టసాగింది. అతను యుక్తిగా దాని తలను తన కుడిచేత్తో బలంగా నొక్కిపట్టాడు.

ఉస్మాన్ దాసీ దాన్ని పంపి ఒక కత్తి తెప్పించి, ఎడమచేత కత్తి పట్టుకుని, తన

ఉడిచేతిని పట్టుకుని ఉన్న పాముకు చాలా చోట్ల కోతలు పెట్టాడు. చివరకు దాన్ని బలం కొద్దీ దూరంగా విసిరి పారేశాడు. చేతులకైన రక్తం కడుగుకోవటాని కతను కొలను వద్దకు వెళ్ళిన సమయంలో అయ పాకు నిద్రా భంగమయింది.

అమె లేచి, దాసి దాని ద్వారా ఉస్మాను అక్కడికి వచ్చినట్టు తెలుసుకుని, తనకు నిద్రలో చల్లగా తగిలినది అతని చెయ్యి అయి ఉంటుందనుకున్నది. ఆమెకు చాలా కోపం వచ్చి, అతను కొలను దగ్గిర ఉన్నా డని తెలిసి, అక్కడికి వెళ్ళి, "ఎందు కింత నీచపు పని చేశావు? నేను నిద్ర పోతున్న చోటి కెందుకు వచ్చావు?" అని దారుణంగా ప్రశ్నించింది.

"అయుషా, నేను నిన్ను ప్రేమిస్తున్నా ననీ, ప్రేమ ఉన్నచోట నీచభావాలకు చోటులేదనీ నీ కింకా తెలియదా? పెళ్ళి యీడు మించిపోయినా నే నింకా పెళ్ళాడ లేదు. నేను నవాబును, నా యిష్టం వచ్చిన స్త్రీని పెళ్ళాడగలను, ఉంపుడుగత్తెలను ఉంచుకోగలను. నీవే నా భార్యవు కావా లన్న కోరిక చేత నేనా పని చేయలేదు. నిన్ను తాకదలిస్తే నివు నిద్ర పోతుండగా దొంగలాగా రావాలా? బహిరంగంగా నిన్ను నాదాన్ని చేసుకుంటే ఎవరడ్డుతారు? నిన్ను నేను బలాత్కరించలేదే!" అన్నాడు ఉస్మాన్. అత నామెకు తాచుపాము సంగతి చెప్పాడు.

అయుషా కన్నీరు కార్చుతూ అతని చేతులు రెండూ పట్టుకుని, "ఉస్మాన్, నీ ప్రేమ అతిపవిత్రమైనది? దాన్ని నా వంటి అపాత్రురాలి కెందుకు దానం చేస్తావు? నేను చచ్చి అయినా పోయాను కానేం? నన్నా పాము నుంచి ఎందుకు రక్షించావు, ఉస్మాన్!" అని ఏడుస్తూ అక్కడి నుంచి వెళ్ళిపోయింది. ఉస్మాన్ హతాశుడయాడు. —(ఇంకావుంది.)





# నవాబునందిని

## 5

మానసింహ మహారాజు అంతులేని పరివారాన్ని వెంటబెట్టుకుని పూరీ జగన్నాథ క్షేత్రం చేరుకున్నాడు. సముద్ర తీరాన ఆయన కోసం ఒక మైలు నిడివీ, వెడల్పూ గల నగరం లాటి శిబిరం నిర్మించారు.

మహారాజు జగన్నాథ క్షేత్రానికి బయలుదేరే ముందుగా పఠానుల కొక లేఖ పంపుతూ, తాను వారి రాజ్యం ఉండా ప్రయాణించే టప్పుడు నవాబులు తనను వచ్చి చూడాలని, తనకు తగిన ఏర్పాట్లు చేయాలనీ అడిగాడు. కాని ఆయనను చూడటానికి సులేమాన్‌ఖాన్ గాని, ఉస్మాన్ ఖాన్ గాని రాలేదు. నవాబు కుటుంబానికి చెందిన వ్యక్తి ఎవరో వచ్చి స్వాగతం తెలిపాడు. పఠానుల ప్రవర్తన మానసింహుడికి అసంతృప్తి కలిగించింది.

మానసింహ మహారాజుకు పట్టపురాణి జగతసింహుడి తల్లి. మానసింహుడికి ఆమె పైన ఎంతో గౌరవం, కాని ప్రేమ అంతగా లేదు, పై పెచ్చు కొంత భయం కూడా ఉన్నది. భర్త దేశదేశాలు తిరుగుతుంటే ఆమె ఆయన వెంట తిరగదు. మానసింహుడి ఇంకా అనేక భార్య లున్నారు. కాని అందరి కన్న జోధ్పూరు రాజకుమార్తె అయిన ఊర్మిళ అంటే ఆయనకు అంతులేని ప్రేమ. పూరీజగన్నాథ క్షేత్రానికి ఆయన వెంట వచ్చిన ముగ్గురు భార్యలలో ఆమె కూడా ఉన్నది.

దామోదర ముఖర్జీ



పూరిలో మహారాజు కవసరమైన ఎర్పాట్లన్నీ తృప్తికరంగా చేసినవాడు రామచంద్ర దేవుడనేవాడు. అతను దేవవంశం వాడు. ఒరిస్సాను పఠానులు జయించక పూర్వం దేవవంశపు రాజులే అక్కడ పరిపాలన చేశారు. పూరీ క్షేత్రం సంధి నిబంధనల ప్రకారం మొగలులది కాగానే రామచంద్ర దేవుడు దానికి శాసనాధికారిగా నియమించ బడ్డాడు.

పూరీలో మానసింహుడు వారం రోజులుండ సంకల్పించాడు. అందులో రెండు రోజులు గడిచిపోయాయి. మూడో నాడు సాయంకాలం మానసింహుడు జగన్నాథాలయంలో మంగళహారతి చూసి ఊర్మిళ ఉండే డేరాకు తిరిగి వచ్చాడు. ఆయన కోసం వంట తయారు చేస్తున్న ఊర్మిళ ఆయన వచ్చినట్టు తెలిసి ఆయన ఉన్న చోటికి ఒక బాలికను వెంటపెట్టుకుని వచ్చింది. ఆ బాలిక అసాధారణ సౌందర్యవతిగా ఉన్నది.

"ఈ అమ్మాయి ఎవరు? సాక్షాత్తూ లక్ష్మి లాగుందే!" అని మానసింహుడడిగాడు.

"ఈ పిల్ల నా స్నేహితురాలి కూతురు. తల్లీ కూతుళ్ళు జగన్నాథస్వామి దర్శనార్థం వచ్చారట, ఇవాళ మధ్యాహ్నం నన్ను చూడవచ్చారు. నా స్నేహితురాలు వెళ్ళిపోయింది, కాని నేనీ పిల్లను కొన్నాళ్ళు నా వద్ద ఉంచుకుంటానని నిలిపేశాను," అన్నది ఊర్మిళ.

"ఈమెకు పెళ్ళి అయిందా?"

"అయింది, కాని ఆ సందర్భంలో మీతో చెప్పవలసిన విషయం ఒకటున్నది. దాని విషయం తరవాత మనవి చేస్తాను."

"అలాగే. ఈ అమ్మాయి పేరేమిటి?"

"రాజలక్ష్మి."

"బాగుంది. నిశ్చయంగా ఈమె రాజలక్ష్మే."





అది మొదలు రాజలక్ష్మి మహారాజుకు అనేక విధాల సేవ చేస్తూ ఆయనను మెప్పించింది.

మానసింహుడు పూరీకి వచ్చి పది రోజులయింది. కాని ఆయన శిబిరం ఎత్తి వెళ్ళిపోయే సూచన లేవీ లేవు. ఈ లోపుగా పఠానునవాబుల వార్తలు కొన్ని ఆయనకందాయి. మంచాన పడి ఉన్న ముసలి వజీరు ఈసాఖాన్ చనిపోయాడు. పేరుకు నవాబయినా సులేమాన్‌ఖాన్‌కు రాజకీయాల గొడవ ఏమీ తెలియదు; అతనా బాధ్యత లన్నిటినీ ఉస్మాన్‌ఖాన్‌కే వదిలిపెట్టేశాడు. కొత్త వజీరుగా ఖిజర్‌ఖాన్ అనే వాణ్ణి ఉస్మానే నియోగించాడు. ఖిజర్‌ఖాన్ అన్ని విధాలా ఉస్మాన్‌ఖానును పోలినవాడు; సాహసికుడు; యుద్ధప్రియుడు. అతని వయసు నలభై ఆరేళ్ళు. రాజ్యపాలన యావత్తూ ఉస్మాన్‌ఖాన్ చేతి పైననే నడుస్తున్నది.

మానసింహు డీ సమాచార మంతా తెలుసుకుని రామచంద్రదేవుడితో సమాలోచన చేశాడు. ఉస్మాన్ త్వరలోనే సంధికి స్వస్తి చెప్పేస్తాడు. అతని ప్రవర్తన అదివరకే నిర్లక్ష్యంగా ఉంటున్నది. అతను మానసింహుణ్ణి పూరీలో కూడా చూడరాలేదు. అతను యుద్ధపిపాసి. అతనికి పాదుషా పట్ల గౌరవాభిమానా లేమీ ఉన్నట్టు కనబడలేదు. మానసింహుడు తాను పఠానులతో యుద్ధం చెయ్యటానికి సంసిద్ధుడుగా లేని తరుణంలో సంధి చేసుకున్నాడు. అప్పుడాయన యుద్ధానికి ఆయత్తుడై ఉన్నాడు. కాని, పఠానులు తామై సంధి నియమాలను ఉల్లంఘించితే తప్ప, వాటికి భంగం కలగటం ఆయన కిష్టం లేదు.

చివరకు ఉస్మాన్ పూరీ నగరానికి వచ్చాడు. అపరాహ్ణ వేళ మహారాజు, మిత్ర రాజుల తోనూ, రామచంద్రుడి తోనూ సభామంటపంలో కూర్చుని ఉండగా ఉస్మానక్కడికి వచ్చాడు. మానసింహు డతనికి





చేయవలసిన మర్యాదలన్నీ చేసి ఉచితాసనం చూపాడు.

ఉస్మాన్ చాలా అందమైనవాడు, చాలా మంచి దుస్తులూ, తలపాగా, పొడుగాటి ఖడ్గమూ ధరించి ఉన్నాడు. మహారాజు లాంఛనగా ముసలి వజీరు మరణం గురించి మాట్లాడి, "నేను ఒరిస్సా దేశానికి వచ్చానే గాని, ఒరిస్సా నవాబుల దర్శన భాగ్యం కలుగుతుం దనుకోలేదు. ఇవాళ మా అదృష్టం వల్ల ఆ భాగ్యం కలిగింది," అన్నాడు కొంచెం వెటకారంగా.

ఉస్మాన్ ఆ వెటకారాన్ని అర్థం చేసుకుని, "మేము నిజంగా తమకు ఆత్మీయుల



మైనట్టయితే మా దర్శనం భాగ్యంగా అనుకోవటానికి వీలుండేదేమో. కాని మాకు తమ ఆత్మీయులమై ఉండే భాగ్యం లేదు. ఉండినట్టయితే మేము తమ దర్శనం చేసుకోమని ఆజ్ఞాపిస్తూ దాసులకు రాసినట్టుగా రాసిఉండరు," అని కుండ పగలేసినట్టు అనేశాడు.

మానసింహుడు కూడా కుండ పగలేసినట్టు మాట్లాడ నిశ్చయించుకుని, "ఆజ్ఞలు పాలించే దాసులు ఆత్మీయులు కాకూడదని ఎక్కడున్నది? కావటమూ కాకపోవటమూ వారి గుణాలను బట్టీ, శక్తిని బట్టీ ఉంటుంది. నవాబులు పాదుషాకు లోబడి ఉండటానికి సమ్మతించారు; ఆత్మీయులుగా ఉంటారో, ఉండరో వారే తేల్చుకోవాలి," అన్నాడు.

మీరు మా ఆజ్ఞలను పాలించే దాసులే నని మానసింహుడు స్పష్టంగానే అనేసరికి ఉస్మాన్ ముఖం కంది పోయింది. అతను ఓర్పు తెచ్చుకుని, "బంగాళా దేశపు సుబేదారుగారూ, నేను మీతో వాదించటానికి రాలేదు. మీ వంటి వారితో వాదించటం నాకు పరువు తక్కువ. మీతో అనేక ముఖ్య విషయాలు మాట్లాడ వలసిన అవసరం ఉన్నది, కాని మీ ఇప్పుడు ప్రకటించే వైఖరి



